శ్రీరస్తు.

# సువృత్తతిలకము.



ఇది

శతావధానులు,

శ్రీపీఠికాపుర సంస్థాన విద్వత్కవులగు

వేంకట రామకృష్ణకవులచే రచియింపఁబడినది.

మొదటికూర్పు.

కాకినాడ

1913

శ్రీసుజనరంజనీముద్రాక్షరశాలయందు

పోతాప్రగడ బ్రహ్మశంకరరావుచే ముద్రింపఁబడి

గ్రంథకర్తలచేఁ బ్రకటింపఁబడియె.

వెల 0-1-0.

శ్రీరస్తు.

# సువృత్తతిలకము.

## ప్రథమవిన్యాసము.



చ. గిరిపతిపుత్త్రి పంచశర ♦ కేళుల నీసుజనింపఁగా గణే
శ్వరగురుఁగేరి విభ్రమవ ♦ శమ్మునఁ బత్కచమున్ గ్రహించుచోఁ
గరరుహరేఖ పాతె ననఁ ♦ గా దయివారెడు చంద్రమఃకలాం
కుర మహారత్నరంజిత మ ♦ కుంకుముఖమ్ముల మాకొసంగుతన్.

మంజరి. స్వచ్ఛందలఘుగురూపు ♦ జగదేకగురుని
స్పష్టవామనవృత్తుఁ ♦ జక్రిని దలఁచి
ఛందోనిధానము ♦ సద్వృత్తవేద
సూస్మృతావాసు వ్యా ♦ సుని గొనియాడి
శిష్యశిక్షార్థమై ♦ క్షేమేంద్రసుకవి
విరచించినట్టి సు ♦ వృత్తతిలకముఁ
బరికించి యది మేలు ♦ బంతిగా నేము
రామకృష్ణులము వా ♦ గ్రామకృష్ణులము
పావనంబు నొక్కంత ♦ యాంధ్రవాఙ్మయము.

క. ఛందమ్ముల నారసి త
త్సౌందర్యమ్మున్ గణించి ♦ సత్కావ్యములన్
బొందుపడిన వృత్తమ్ముల
నెందుఁ గవుల్వాగడ సంగ్ర ♦ హించెద మిందున్.

గణయతిప్రాసలక్షణంబులు ప్రాచీనగ్రంథమ్ముల నెఱుంగునది.

దశమచ్ఛందమ్మగు పఙ్క్తియందు—

పర్వెన్ మ్మార్గములు ♦ పణవం బయ్యెన్.

UUU మ, III న, IUU య, U X ఆఱింట యతి.

వీయుల్లం బోఁక ♦ నియతిం గార్యం
బాయ త్తంబుగ ♦ ననుసంధింపన్
జేయం జాలవు ♦ చెడుద్రోవం బోఁ
బాయం ద్రోవవు ♦ బలిమిం బుత్త్రీ.

స్త్రీపర్వము.

క్రాలెన్ శుద్ధవి ♦ రాట్టు మస్జగల్

UUU మ, IIU స, IUI జ, U X- ఆఱింట యతి.

ఉల్లం బప్రియ ♦ మొందఁ గ్రొత్త సం
ధిల్ల న్నెవ్వగ ♦ దీన వక్త్రిఁ దై
యొల్లం బోవుచు ♦ నున్న నవ్విభుం
డల్లం గౌఁగిట ♦ నాన్నృపాలకున్.

స్త్రీపర్వము.

ఏకాదశ చ్ఛందం బగు త్రిష్టుప్పునందు—

తా నింద్రవజ్రం బగుఁ ♦ దాదగాలన్

UUI త, UUI త, IUI జ, UX, UX- ఎనిమిదింట యతి.

చింతాపరత్వంబునఁ ♦ జెందు దుఃఖా
క్రాంతత్వ ముర్వీశ్వర ♦ కాన నెప్డున్
జింతింపఁ డార్యాత్ముఁడ ♦ చింతనుం దై
యంతఃపరీతాపము ♦ నార్పఁ జాలున్.

స్త్రీపర్వము.

ఉపేంద్రవజ్రన్ జత ♦ లొప్పు గ్గల్గన్

IUI జ, UUI త, IUI జ, UX, U X- ఎనిమిదింట యతి.

మరుత్తనూజుం బరి ♦ మార్పఁ జూచుం
బరిస్ఫురత్కోపని ♦ బద్ధుఁ డై యి
ద్ధరావిభుం డం చిది ♦ తల్ల నే సం
స్మరించి యీ కోపు న ♦ మర్చికొంటిన్.

స్త్రీపర్వము.

పైరెంటి పాదముల్మలఁ ♦ బట్టి యెందు
చ్చరింతు రద్దా నుప ♦ జాతి నాఁగన్.

మునింవ్రి నిర్భాగ్యత ♦ ముట్టి చావం
గా నేరదయ్యెం గడు ♦ గట్టిచిత్తం
బనూనమూర్ఛం దెగ ♦ టాఱియుం దా
రా నేర్చె నిమ్మనికిఁ ♦ గ్రమ్మఱంగన్.

స్త్రీపర్వము.

వ్రాలు రేఫ న ర ♦ వల్ రథోద్ధతన్
∪ I ∪ ర, I I I న, ∪ I ∪ ర, I ∪ వగణము. ఏడింట యతి

హారహీర ధవ ♦ ళాంశు నిర్మలో
దారకీర్తి రణ ♦ దర్ప సద్గుణా
వార వీరనిర ♦ వద్య మన్మథా
కార ధీర పర ♦ గండభైరవా.

సభాపర్వము.

స్వాగతంబు రన ♦ భల్ గగ మొప్పన్.
∪ I ∪ ర, I I I న, ∪ I I భ, ∪ గ, ∪ గ- ఏడింటయతి

వేగవంతుఁ డను ♦ వీరుఁడు సాంబున్
వేగవంతుఁ డయి ♦ వీఁకను దాఁకెన్

వేగశాణపత • పీతతులం ది
గ్భాగముల్ విశిఖ • పంజరముల్ గాఁగ.

అరణ్యపర్వము.

భత్రియిద్రోధక • పద్యము గాయుఁగ.
◡ | | భ, ◡ | | భ, ◡ | | భ, ◡ ◡ గగము- పదింట యతి

మానుమజన్మము • మాన్య వివేకా
మానవ దుఃఖస • మాజము నెల్లఁ
దాన ఘటించుచు • దైన్యముఁ దెచ్చుం
గాన భవం బిది • గాన్పని తండ్రీ !

శ్రీ[illegible]ర్వము.

ద్వాదశచ్ఛందమ్మగు జగతియందు—

నతిఁ ద్రోటకవృత్తము • నాల్గు సగణ
| | ◡ స, | | ◡ స, | | ◡ స, | | ◡ స. తొమ్మిదింటయతి.

నిరవద్య సరేశ్వర • నిత్యనిరం
తరధర్మమతీ గుణ • ధామ జగ
త్పరిపూరితకీర్తి వి • భాసి విభా
కరతేజ నృపోత్తమ • కాంతినిధీ !

ఆదిపర్వము.

మఱియు—

సతతంబును శిష్యులు • సద్వినయా
న్వితులై ప్రణమిల్లెడు • వీరి పద
ద్వితయంబు గదుం జెడఁ • దిన్నవి సూ
చితె నక్కలు దైవము • చెల్లుఁ గటా !

శ్రీపర్వము.

ద్రుతవిలంబిత ♦ మగు నభభ్రముల్.

I I I న, — I I భ, — I I భ, — I — ర- ఏడింట యతి.

త్రిభువనాంకుశ ♦ దీప్తినిధీ సమ
స్త భువనాశ్రియ ♦ ధర్మధురంధరా
శుభయశః పరి ♦ శోభితపూర్వది
క్ప్రభు విలాస కృ ♦ పారసబంధురా.

ఆదిపర్వము.

మఱియు—

చనఁగ నాతఁడు ♦ సాత్యకి వాయునం
దనుఁడు గాండివి ♦ యమ్ములు సూరెలం
బనిఁ బ్రావ ♦ సంభృతశోక మై
చనియెఁ జట్టుపుఁ ♦ జానలు చుట్టిరా.

స్త్రీపర్వము.

భుజంగప్రయాతం బ ♦ గు౯ నాల్గు యాల౯

I — — య, I — — య, I — — య, I — — య.

ఎనిమిదింట యతి.

వినీతుండ వై ధర్మ ♦ వేదిత్వబుద్ధిం
దన ర్పొందు నీ విట్లు ♦ దైన్యాతిరేకం
బునం బొంగి శోకాగ్నిఁ ♦ బొక్కంగ నేఁ గుంతీ
తనూజాగ్రజుం డాత్మఁ ♦ దాఁ గుంద కున్నే.

స్త్రీపర్వము.

రద్వయి౯ రద్వయి౯ ♦ స్రగ్విణీవృత్త మౌ.

— I — ర, — I — ర, — I — ర, — I — ర.

ఏడింట యతి.

ఏము నీ పుత్త్రుచే ♦ నెన్నియేఁ భంగుల౯
వేమఱుం బాటు నీ ♦ వెంట భావించుచు౯
సామసంపాది వై ♦ సైఁచు మా తప్పుల౯
ధీమహత్త్వంబు సం ♦ ధిల్లు నీ కెమ్మెయి౯.

స్త్రీపర్వము.

లలితపదంబు సె ♦ లంగు న జాయల్

I I I న, I U I జ, I U I జ, I U U య. ఎనిమిదింట యతి.

తమ తమ తప్పులఁ ♦ దారెరియం గా
విమలమతీ యిటు ♦ వీరికి నై శో
కమున దహింపఁ గఁ ♦ గాదు మనంబు౯
సముచిత మిత్తఱి ♦ శాంతత సుమిత్రా

త్రయోదశచ్ఛందం బగు నతిజగతియందు—

భర్మభగమ్ములం జలద ♦ పద్య మగు౯.

U I I భ, U I U ర, I I I న, U I I భ, U గ. పదింట యతి.

నీ పలు కెల్ల నిక్కమ యు ♦ నింద్యగుణా
యీ పురుషార్థహాని నుతు ♦ లీల్గుటకు౯
దాపముఁ బొంది శాల్మఁ దిగఁ ♦ ద్రావి మహా
కోపుఁడ నైనఁ బాటిల్లఁ ద ♦ గుం గినియ౯.

మహి నజ్సజల్ గురువు ♦ మంజుభాషిణిగ

I I U స, I U I జ, I I U స, I U I జ, U గ. తొమ్మిదింట యతి.

ధన మంతయుం బొలియ ♦ దారుణంబుగాఁ
దనయవ్రజంబు దెగ ♦ దైన్యమూరఁగాఁ

దనబంధు లందఱు మృ ♦ తంబుఁ బొంద నె
వ్వని నైన శోక మను ♦ వహ్ని గాల్పదే.

స్త్రీపర్వము.

చతుర్దశచ్ఛందం బగు శక్వరియందు—

ఒప్పు భజసల్ వసమ ♦ యూరము నగాలున్.

◡ । । భ, । ◡ । జ, । । ◡ స, । । । న, ◡, ✕ ◡ ✕.

తొమ్మిదింట యతి.

రాజకులశేఖర ప ♦ రంతప వివేక
భ్రాజిత జగద్వలయ ♦ భాసురసముద్య
త్తేజ నిరవద్య సు ♦ దతీమదన వీరో
గ్రాజవిజయా త్రిభువ ♦ నాంకుశ నరేంద్రా.

ఆదిపర్వము.

మఱియు—

హోర నాద లసద్విపరి ♦ పూతముగ క్షితిం
దారతఁ బిత్రాదికిఁ బ ♦ దం బిడక దృప్య
ద్వైరితతి నొంచి వెగు ♦ వా రగుట మే లు
ర్వీరమణకోటి కని ♦ వేదములు సెప్పుఁగా.

స్త్రీపర్వము.

క్రాలున్ వసంతతిల ♦ కం దభజల్ జగాలున్

◡ ◡ । త, ◡ । । భ, । ◡ । జ, । ◡ । జ, ◡ ◡

గగము- ఎనిమిదింట యతి.

ఈబాలు నెత్తికొని ♦ యింటికిఁ జన్న నన్నున్
నా బంధు లందఱు మ ♦ నంబున నేమి నారే

యీబాలు సూర్యనిభు ♦ నిట్టుల పెట్టి పోవం
గా బుద్ధి వుట్ట దని ♦ కన్య మనంబులోనన్.

ఆదిపర్వము.

రహి ననభనవల్ ♦ ప్రహరణకలితన్

| | | న, | | | న, ⌣ | | భ, | | | న, | ⌣ వగణము-

ఎనిమిదింట యతి.

ఇది యిటు లగు ట ♦ క్లిత్రిఁగి పలికె నా
విదురుఁడు సభఁ గో ♦ విదులు వొగడఁ గా
నది వినియును నే ♦ నడపన దురితం
బొదవెఁ గలనఁ జే ♦ టొలయు కుడుగు నే

స్త్రీపర్వము.

పంచదశచ్ఛందంబగు నతిశక్వరియందు—

ననమయయుల నొప్పన్ ♦ మాలినీవృత్త మెస్సన్

| | | న, | | | న, ⌣⌣⌣ మ, | ⌣⌣ య, | ⌣⌣

య- తొమ్మిదింట యతి.

సురపతిసభఁ జూడం ♦ జూడ నంగారవృష్టుల్
గురిసెఁగులిశధారల్ ♦ గుంఠితంబయ్యె దిక్కుం
జరమదము లడంగెన్ ♦ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వే ♦ గంబునన్ సంచలించెన్.

ఆదిపర్వము.

మణిగణనికరము ♦ మహి ససననసల్

| | | న, | | | న, | | | స, | | | న, | | ⌣ స- తొమ్మిదింట యతి.

గొడుగులపజియలు ♦ గురుకులు గొనుటన్
సిడములతునియలు ♦ సెదరి యునికిఁ బెం

దడఁ బడి పడగలు ♦ దఱచు మ్మురియు నై
పుడమిఁ గలయుటకుఁ ♦ బోఁగు లోఁలయు మదిన్

స్త్రీపర్వము.

అంగమైన మణిభూషణ ♦ హా రనభారలన్

U I U ర, I I I న, U I I భ, U I I భ, U I U

గ, పదింట యతి.

రామవిక్రముఁ డజేయుఁడ ♦ రాతిగజాద్రి
సామజాహితుఁడు సాంబుఁడు ♦ సాల్వచమూపతిన్
క్షేమవృద్ధి యనువాని న ♦ కృత్రిమసాహసో
ద్దామఁ దాఁకె శరధారల ♦ ధామణిఁ గప్పుచున్

ఆరణ్యపర్వము.

షోడశచ్ఛందమ్మగు నష్టియందు—

నభజజాగలుగ ♦ నందగుఁ బద్మకమందొగిన్.

I I I న, U I I భ, I U I జ, I U I జ, I U I జ,

U గ, ఎనిమిదింట యతి.

తొడుకుపల్కులవిని ♦ కూడదు నాకదురాత్ముఁడై
కడఁగిమీకునప ♦ కారము సేసిధరిత్రివె
ల్వడఁగఁబరచెఁగడుఁ ♦ బాపమతిన్ ధృతరాష్ట్రుఁడ
య్యెడలమర్జనుల ♦ నెఘుతినమ్మఁగఁ బోలునే.

ఆదిపర్వము.

మొలఁగెడు నజ్భ జర్గములు ♦ మేదినిం గనంగన్.

I I I న, I U I జ, U I I భ, I U I జ, U I U ర, U గ,

పదునొకంట యతి.

విను మిటు లేటికిం జనిన ♦ వృత్త మూఁది యల్లఁగ
జనము నుతించు నీదు గురు ♦ సారధీరబుద్ధిఁగ
విను నతిశాంతచిత్తయని ♦ నిక్కమేను గంటను
నమ్రసముఁ నిట్టి నీకగునె ♦ మత్స్యగంధి నతాస్య.

స్త్రీపర్వము.

రహిం జెప్పన్ వచ్చున్ యమనసభవల్ ♦ రాఁ శిఖరిణిన్.

| ‿ ‿ య, ‿ ‿ ‿ మ, ||| న, || ‿ స, ‿ || భ

| ‿ వగణము. పదుమూఁడింట యతి.

తపస్స్వాధ్యాయాది స్ఫురితమతిచి ♦ త్తప్రకటితా
విపజ్జ్వాలజ్వాలా విశమనసుధా ♦ వృష్టిలలితా
జపాపుష్పశ్రీరచ్ఛవికిరణసం ♦ సర్గమధురా
సపర్యావిర్భావ స్తవనకలనా ♦ సైన్యముసురా.

స్త్రీపర్వము.

జసల్ జసయవంబులున్నఁ దువ ♦ జక్కఁగాఁ బృథ్వియా.

| ‿ | జ, || ‿ స, | ‿ | జ, || ‿ స, | ‿ ‿ య,

| ‿ వగణము. పండ్రెండింట యతి.

అమూల్యమణిభూషణమ్ములు గ ♦ జాశ్వబృందంబులున్
సమృద్ధధనధాన్యరాసులుఁ బ్ర ♦ శస్తగోవర్గముం
గ్రమంబునను భూసురేంద్రులకు ♦ గన్యాపుణ్యార్థియై
యమర్త్యనిభుఁ డిచ్చెఁ బాండువిభుఁ ♦ డత్యుదారస్థితిన్.

ఆదిపర్వము.

# ప్రథమ విన్యాసము

నజభజజజల్ వయుం గలయ ◆ నర్కుటవృత్త...

I I I న, I U I జ, U I I భ, I U I జ, I U I జ, I U

నగణము- పదునొకంట యతి.

వినుము మహత్తమాభవ్యుఁడు ◆ విశ్రుత ధర్మగతిం
జనక మహాక్షితీశ్వరునిఁ ◆ జంపె గదాసమరం
బున నది యే మొఱంగి చని ◆ పోయిన రేయిఁ గడుం
గనలున ముట్టి మువ్వురము ◆ గౌర్యముదగ్రముగన్.

స్త్రీపర్వము.

మందాక్రాంతన్నిలుపఁగదగున్ ◆ మభ్నతల్ తంబుగాయున్.

U U U మ, U I I భ, I I I న, U U I త, U U I
త, U U గగము. పదునొకంటయతి.

వీణానాదప్రతిమనిగమా ◆ విశ్వవత్సారఘణ్యా
శ్రీశోభాసంపాదితవిమలతా ◆ క్షేమనిశ్శేషచిత్త
త్రాణక్రీడాకలనసతతో ◆ త్సాహవద్దివ్యభావా
ప్రాణాపానావరణనిపుణా ◆ ప్రాపణేయానుభావా.

స్త్రీపర్వము.

అష్టాదశచ్ఛందంబగు ధృతియందు.

మానుగా రసజాభరేఫల ◆ మత్తకోకిల వృత్తమౌ.

U I U ర, I I U స, I U I జ, I U I జ, U I I భ
U I U ర, పదునొకంటయతి.

ఆదిదేవుఁడ వైననీవు ద ◆ యామతిం బొడసూపి న
న్నాదరించుటఁ జేసి ధన్యుఁడ ◆ నైతి నింతకు నెక్కుడౌం

డేది గర్లెడుఁగానినామది ♦ యెల్లవాఁడును గ్రోధమో
హాదులం బెడఁబాసి ధర్మువు ♦ నందు నెక్కొనఁజేయవే.

అరణ్యపర్వము.

ఏకోనవింశచ్ఛందంబగు నతిధృతి యందు—

సౌరాఖ్యా మసజస్తతమ్ములు గముల్ ♦ శార్దూలవిక్రీడితమ్.

U U U మ, | | U స, | U | జ, | | U స, U U
త, U U | త, U గ. పదుమూఁడింట యతి.

రాధేయుండును మన్ననేయఁడును బో ♦ రం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నెండొకఁడు నా ♦ కుంద్రోడ నీవింక నా
బాణంబెట్టకు వాఁడిసూది మొనమో ♦ పంజాలు నంతేని నే
నీనాత్రితలమీఁనువారలకు నా ♦ కేలింత నేగింబడన్.

ఉద్యోగపర్వము.

ఎలమి నభ్రసజాగముల్ వచి ♦ యింపఁగాఁ దరళంబగున్.

| | | న, U | | భ, U | U ర, | | U స, | U | జ,
| U | జ, U గ. పండ్రెండింట యతి.

కులపవిత్రసితేతరోత్పల ♦ కోమలామలవర్ణయు
త్పలసుగంధి లసన్మహోత్పల ♦ పత్త్రినేత్ర మదాలికుం
తలవిభాసిని దివ్యతేజముఁ ♦ దాల్చియొక్కకుమారి ద
జ్జ్వలనకుండమునందుఁబుట్టె బ ♦ సన్నమూర్తి ముదంబుతోన్.

వింశచ్ఛందంబగు కృతియందు—

మహిఁగూర్పందగు సభ్రసమ్యవములన్ ♦ మత్తేభవిక్రీడితమ్.

| | U స, U | | భ, U | U ర, | | | న, U U U
మ, | U U య, | U వ, పదునాలుగింట యతి.

కలఁగెం బ్రోయున్న సప్తకంబు గిరివ ♦ ర్గంబెల్ల మాఱాడె సం
చలితంబొందె వసుంధరావలయ మా ♦ శాచక్రిమల్లాడెఁ గొం
దలమందెం ద్రిదశేంద్రుపట్టణము పా ♦ తాళంబు ఘూర్ణిల్లె నా
కులమయ్యెం గ్రహతారకాకులము సం ♦ క్షోభించె నవ్వేధయున్.

విరాటపర్వము.

ఉత్పలమాలికన్ భరన ♦ యుక్తిని భారలగమ్ము లొప్పెడిన్.

U | | భ, U | U ర, | | | న, U | | భ, U | | భ
U | U ర, ల, U గ. పదింట యతి.

శూరుఁడవంచు నిన్మ్రపు ♦ వాచ్చుట శౌర్యము సొప్పెమానమే
యూరికిఁ బోయె నాజి నృపు ♦ లోడుమ రేన్నృపుఁడన్నమాత్రియే
కౌరవవంశజాతుఁడవు ♦ గష్టపుఁ జావుమఁ జెచ్చుకొంటి నీ
పేరును బెంపుమాలి మఱి ♦ బ్రుంకమునవ్వఁగ నిట్లు సేయుదే.

శల్యపర్వము.

భార్యయుమున్ రసవంబు సుజక్కఁగఁ ♦ బల్క నంబుసుహంబగున్

U | | భ, U | | భ, U | | భ, U | | భ, U | U
ర, | | U స, | U వ. పదమూఁడింట యతి.

పెద్దయుఁగాలము వారలఁ జూడక ♦ పేర్మిడించుచు దుర్భరా
పద్దశనుండుట నమ్మహాత్ముల ♦ పట్లుంగడఁ ద్రుంగుటన్
దద్దయుశోకమునం బొరి నశ్రువు ♦ ధారలొల్కవగచ్చుతో
నద్దురవస్థ తెలుంగుగ మంగళ ♦ యుంగకంబున నార్చెలె.

స్త్రీపర్వము.

ఏకవింశచ్ఛందంబగు ప్రకృతియందు—

నజభజజల్ జరేఫలఁ బె ♦ నంగొనఁ జంపకమాల యయ్యెడిన్.

I I I న, I U I జ, U I I భ, I U I జ, I U I జ, I U I జ, U I U ర, పదునొకంట యతి.

విను మునరేంద్ర విప్రుఁడలి ♦ నెఱ జమదగ్నిసుతుండు శాపము
న్చె నమరభర్త వంచనము ♦ సేసె వరంబని కోరి కుంతి మా
న్పె నలుక భీష్ముఁ డర్ధరథుఁ ♦ జేసి యడంచెఁ గలంచె మద్రరా
జనుచితమాడి కౌరవిభ ♦ యమ్మెనియుండటుఁ జంపెఁ గర్ణునిన్.

శాంతిపర్వము.

మ్రభ్నల్ నాల్గుం యకార ♦ త్రయమును బలుకన్ ♦ స్రగ్ధరా వృత్తమయ్యెన్.

U U U మ, U I U ర, U I I భ, I I I న, I U U య, I U U య, I U U య, ఎనిమిదింట, మఱల నెనిమిదింట యతి.

అంతం గాంగేయుఁ డస్తా ♦ యతభుజుఁడు నయుం ♦ డల్లిపాంచాలు సంధి
ధ్వాంతంబుల్ వానివాహో ♦ త్రమతుహినతతిం ♦ దద్భటోదారతారా
సంతానంబుల్ శరాంశూ ♦ చ్చయవిభవములన్ ♦ శాంతిఁ బొందించి యుక్త
ధ్వాంతారాతిప్రభుండై ♦ తనరుచు వెలిఁగెం ♦ దక్షిణవ్యోమవీథిన్.

ఆదిపర్వము.

ద్వావింశచ్ఛందమ్మగు నాకృతియందు—

సతతనసారిగమ్ములంగ ♦ చ్చఁబలుక మహా ♦ స్రగ్ధరావృత్తమయ్యెన్.

| | U స, U U | త, U U | త, | | | న, | | U స,
U | U ర, U | U ర, U గ. తొమ్మిదింట, మఱల
నెనిమిదింట యతి.

అతిరౌద్రాకారశైలా ♦ యతదవదహనో ♦ గ్రాగ్రసేనానిపీడా
హతులైనానావిధోపా ♦ యనములుగొనిసా ♦ హార్దవాంఛన్ జయశ్రీ
శ్రితబాహుంగానఁగావ ♦ చ్చిరిసకలజగ ♦ త్సేవ్యమానున్ మహేంద్ర
ప్రతిముం గౌరవ్యవంశ ♦ ప్రభునఖిలమహీ ♦ పాలునాంబాలికేయున్.

ఆదిపర్వము.

ఏడుభకారములొక్కగమున్ రచి ♦ యించినమానిని యండ్రుకవుల్
U | | భ, U | | భ, U | | భ, U | | భ, U | | భ,
U | | భ, U | | భ, U గ. పదుమూఁట యతి.

ఏచి తనర్చి తలిర్చినక్రొవ్విరు ♦ లిమ్మగుతావుల జొంపములన్
జూచినమంచి యశోకములన్ సుర ♦ పొన్నలఁబొన్నలగేదఁగులం
గాచి పెడంగుగఁబండిన యాసహ ♦ కారములం గదళీతతులం
జూచుచు వీనులకింపెసఁగన్ విను ♦ చున్ శుకకోకిలసుస్వరముల్.

ఆదిపర్యము.

త్రయోవింశచ్ఛందమగు వికృతియందు—

సగణమునాఱుజలున్ వముఁగూరిచి ♦ నంగవిరాజవిరాజితమా.

| | | న, | U | జ, | U | జ, | U | జ, | U | జ, | U |
జ, | U | జ, | U వ. పదునాల్గింటయతి.

రజనికరాననఁ బీనపయోధర ♦ రాజితరాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ జంచరగంధిఁ బ్ర ♦ కాశితకాంతిసమన్వితఁ బం

# ప్రథమ విన్యాసము

పంచవింశచ్ఛందంబగు నతికృతియందు—

బలయు ననన, ననభభభగురువులన్ ♦ బంధురవృత్తము సెప్పఁదగున్.

| | | న | | | న | | | న | | | న | | U స U | | భ U | | భ U | | భ U గ పదియాఱింటయతి.

సకలరథములును సఖిలజగములున్ ♦ సర్వహయంబులతోఁ బెరయన్
శకలములు గభటనికర మఖిలముఁ ♦ జావఁగ ద్రౌపది పుత్త్రులలో
నొకరుఁడు బ్రతుకక పొడిపొడియుఁగన ♦ యుర్వికి నారలమూలలమ
స్తకములు కనుమ వడకవడి బలిగా ♦ సంతసమందఁ బిశాచతతుల్

స్త్రీపర్వము.

భాస్కరవిలసితవృత్తమెసంగున్ ♦ భస్జయ భననసగలు సమకూర్పన్

U | | భ | | | స | U | జ | U U య U | | భ | | | న | | | స U స U గ పదుమూడింటయతి.

కౌరవనృపతి తనూజశతంబుం ♦ గంటెపవన సుతుపటుభుజలీలా
ఘోరరతఁ దడఁబడ మేదిని మీఁదం ♦ గూలె వికటముఖ కరచరణంబై
యేరికైనఁ గనుఁగొన్న విషాదం ♦ బెంతయు మది నొలయఁగఁ బ్రియకాంతల్.
చేరివిలపనము సిద్ధయునారిం ♦ జేయఁ గనునికి ననట తిరిఁ బెట్టన్

స్త్రీపర్వము.

షడ్వింశచ్ఛందంబగు నుత్కృతియందు—

చక్కఁగ భజస్న భజ ♦ సన్గగలు సెప్పు నెడ ♦ సత్కవికి మంగళమహాశ్రీ

U | | భ | U | జ | | U స | | | న U | | భ | U | జ | | U స | | | న U U గగ తొమ్మిదింట మ

రలఁదొమ్మిదింట యతి.

ఈతఁడురణంబునకు ♦ నెత్తిచనుచుండియును ♦
నెంతయును భక్తిఁగనినాఁకుం
బ్రీతియెసఁగంబలికి ♦ ప్రేమమెులయం బొగడి ♦
పెద్దయువినీతి నిరతుండై
చేతులు మొగిడ్చిజయ ♦ సిద్ధియుఁగ దీవనవి ♦
శిష్టదయ నిమ్మనిన ధర్మం
బేతల సనూనమగు ♦ నిద్ధజయమాతలకు ♦
నెట్లయిన సిద్ధమగునంటిర.

స్త్రీపర్వము.

మాలికావృత్తములందు—

సమ్మతిమెయిం భజస ♦ నమ్మలపయిం భజస
నమ్మలఁ గ్రిమమ్మసభ ♦ యమ్మల, లయగ్రా
హిమ్మలపెవ్రాసపిర ♦ మమ్మలను నాలిగిటి
నెమ్మనికుదుర్ ప్రతిప ♦ దమ్మునఁ గవీంద్రుల్

∪ | | భ | ∪ | జ | | ∪ స | | | స ∪ | | భ | ∪
| జ | | ∪ స | | | స ∪ | | భ | ∪ ∪ య. తొమ్మిదింటఁ
దొమ్మిదింటఁ వొమ్మిదింటఁ బ్రాసయతి.

కమ్మనిలతాంతములఁ ♦ కుమ్మనసివచ్చు మకు
పములు సుగీతనిన ♦ దమ్మలెసఁగం జూ

తమ్ముల లసత్కిసల ♦ యమ్ముల సుగంధిముకు
ళమ్ములను నానుచు ము ♦ దమ్మొనరవాచా
లమ్ములగు కోకిలకు ♦ లమ్ములరవమ్ము మధు
రమ్ముగుచు వీచెనని ♦ శమ్ము సుమనోభా
రమ్మున నశోకనిక ♦ రమ్ములును జంపక చ
యమ్ములు నుగింశుకవ ♦ నమ్ములును నొప్పెన్.

ఆదిపర్వము.

నసిపడఁగఁ బ్రాసయతు ♦ లొసఁగి నలుమాఱు వెస
నసన నసనంబులును ♦ నసన వసనంబుల్
పినువక రచించు నెడ ♦ నసదృశమనంగఁ దగు
పసలయు విభాతియగు ♦ రసికజనులారా!

| | | న | | ◡ స | | | న | | | న | | ◡ స | | | న
| | | న | | ◡ స | | | న | | | న | | ◡ స | | | న ప

దింటఁ బదింటఁ బదింటఁ బ్రాసయతి.

అరయనిడి పెద్దయని ♦ యమల మొనఁజత్తమున
సరకు గొనకుగ్రిమగు ♦ బరవస మెలర్పం
ద్వరితగతిఁ జొచ్చి కురు ♦ వరుఁడు వలఁ కఁగవిసి
కరతతులు ధేరులని ♦ కరములుఁ దురంగో
త్కరములును గాల్బలము ♦ నరవరులుఁ గీడ్పడఁగ
శరగురుఁడుఁ గర్ణుడును ♦ గురుసుతుఁడు మద్రే
శ్వరుఁడుఁ గృపుఁడుం బఱుపఁ ♦ బరఁగిది విజుల్వొగడ
ధరఁబడి ముకుందఁ మన ♦ నరతనయుఁడొప్పెన్.

స్త్రీపర్వము.

ఆరంభమందుండ కారంబు గానీ న కారంబు కానీ స కారంబుకానీ హ కారంబు కానీ ఘటింపం దగుఁ మీఁద నెల్లం ద కారంబె వల్కంగఁ బోలుంగ కారావసానంబుగా; దీనినే దండకం బండ్రు విద్వన్మణుల్.

త, న, స, హ, గణములలో నొకటి మొదలనిడి, తక్కిన వన్నియుఁ దగణములే కూర్చి చివరనొక గురువు పెట్ట వలయును. యతి ప్రాస నియమము లేదు.

శ్రీకంఠ లోకేశ లోకోద్భవ స్థాన సంహారకారీ పురారీ మురారిప్రియా చంద్రధారీ మహేంద్రాది బృందారకానంద సందోహ సంధాయిపుణ్యస్వరూపా...సురభ్యార్చితా నాకునభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్య మూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః

ఆరణ్యపర్వము.

జాతులందు—

గగభజసనలలఁగండం
బగు,మూఁడైదును బదమ్ములగు • లాదిటసలఁజా
దగు; సరిని మూఁటిపైయతి;
జగణము జేసింబడదు; కొ • సనీగురువొప్పుఁ.

గగ, భ, జ, స, సల, ములఁ గండముఁ జెప్పనగును. మూఁడు గణములొక పాదము నైదు గణములొక పాదమునగును. మొదటి నుండి యాఱవగణము నల. జ, గణములలో నొకటి గావలయును. రెండవ పాదమునందు మూఁడుగణములమీఁద యతి నిలుపవలయును. జగణము బేసి గణమెప్పఁడుగాఁజనదు. కొసయందు(అనగా రెండవపాదముతుదను) గురువుండును. ఇదిపూర్వార్ధము. ఉత్తరార్ధము నిట్లే యెఱుంగునది.

౪. సారథియు రథియు నై రయొక
తేరం గృష్ణు లతిఘోర ♦ తేజస్సార
స్ఫారతఁ దోఁచిన నైనను
ధీరత వాటించి పిదపఁ ♦ దెలిసెదవు బలే.

ఉద్యోగపర్వము.

ఊహ సేయ సూర్యగణము ♦ లొప్పు నేడు, గురువు,ను
త్సాహ వృత్తమందు యతి పొ ♦ సంగు నాలుగింటిపై

ఏడు సూర్యగణములు నొకగురువు. నాలుగుగణముల మీఁదయతి.

ఏల దీని నెడయుఁ జేయ ♦ నీక్షణంబ యేఁగి పాం
చాలుఁ బట్టి తెత్త మధిక ♦ శౌర్యలీల మెఱయఁగాఁ
బోలు ననుచుఁ బెరిఁగి రాజ ♦ పుత్త్రు లెల్ల నరిగి పాం
చాలుపురము ముట్టికొనిర ♦ సంఖ్యబలసమేతులై.

ఆదిపర్వము.

ఇంద్రులుమువ్వురు ♦ నినుఁజూడఁ గడ్టు
లింద్రులు మువ్వురు ♦ నినుఁడునొక్కండు
క్రందుగా రెండేసి ♦ గణములమీఁదఁ
గడుకొనియతినిల్పఁ ♦ గాద్రిలుఁదరోజ.

3 ఇంద్రగణములు 1 సూర్యగణము 3 ఇంద్రగణములు 1 సూర్యగణము. రెండేసిగణములమీఁదఁయతి. ఇదియొకపాదమగును. తక్కిన పాదములు నిట్లే.

ఏలయమ్మనినాకు ♦ నిచ్చెనిమ్మంత్రి
మిమ్మంత్రశక్తియే ♦ నెఱుగంగవేఁడి
యేలపుత్త్రికుఁగోరి ♦ యెంతయుభక్తి
నినుఁదలంచితిఁబ్రీతి ♦ నినుఁడునునాకు

నేలసద్యోగర్భ • మిచ్చెఁ గుమారుఁ
డేలయిప్పుడయూడ • యుంచెనింకెట్టు
లీలోకపరివాద • మేనుడిగింతు
నింతకు నింతయు • నెఱుఁగరెజనులు.

ఆదిపర్వము.

ఇరువు రింద్రులు సూర్యుఁడొకఁడు వెలయఁగా • నెనకొల్పియల్లి
మత్తిఁ గూర్చి నాల్గింటి మీఁద యతి నిల్ప • మధ్యాక్కరంబు.

ఇంద్రగణములు రెండు, సూర్యగణ మొకటి, మఱల నింద్రగణములు రెండు, సూర్యగణ మొకటి, నాలుగు గణములమీఁద యతి.

అవసరజ్ఞుం డయి వ్యాసుఁ డేతెంచె • నంత నత్తపసి
కవిలగడ్డంబును గవిలజడలును • గవిలకన్నులును
దవిన యన్నువనల్లనైన దీర్ఘవుం • దనువును జూచి
యువిద గన్నుంగవ మొగిచి తెలివక • యుండె భయమున.

ఆదిపర్వము.

ఇనుఁడు మువ్వు రింద్రులు చంద్రుఁ • డేకత సొంపునింప
నసువుగా యతి నాల్గిట ; • నగు మధురాక్కరంబు

సూర్యగణ మొకటి, ఇంద్రగణములు మూడు, చంద్రగణ మొకటి, నాల్గు గణములమీఁద యతి.

తనర జనకుండు నన్నప్ర • దాతయును భయత్రాత
యును నవఁగ నింతులకు మువ్వు • రొగిని నయిరి గురువు
లనఘ ! యుపనేత మఱియు ని • రంతరాధ్యాపకుండు
ననఁగఁ బురుషున కియ్యేవు • రనయుంబు గురువు లైరి.

ఆదిపర్వము.

ఉపజాతులందు.—

సీ. క్రమముగా నా ఱుందర్ర ♦ గణములు వాకుర్చ్చి
యినగణంబులు రెండు ♦ కొన వచింప
నది యొక్కచరణమై ♦ యలఁతారు నద్దాని
నడిమికి రెండు తు ♦ న్కలుగఁ జేసి
యతి రెంట రెండింట ♦ నతుకంగఁదగు నిట్లు
తక్కిన మూఁడు పా ♦ దము లొనర్చి
యాటవెలఁదియొండెఁ ♦ దేటగీతంబొండెఁ
జివర నిర్మించిన ♦ సీస మగును

గీ. ఇనగణంబులు మూఁడు రెం ♦ డింద్రగణము
లవల నైదింద్రగణములు ♦ నాటవెలఁది
భానుగణ మొండు రెండు న్వాః ♦ పతి గణములు
దినకరగణమ్ములును రెండు ♦ తేటగీతి.

ఇంద్రగణము లాఱు, సూర్యగణములు రెండు, నొకపాదమగును. దీనిని రెండు ఖండములుగాఁ జేసి మొదటిఖండమున రెండుగణముల మీఁదను మఱల రెండవఖండమున రెండింటి మీఁదను యతి నిల్పఁదగును. చివర నాటవెలఁదిగాని తేటగీతిగాని కూర్పవలయును. ఇదిసీసము.

మొదటి పాదమునకు సూర్యగణములు మూఁడు నింద్రగణములు రెండును, రెం[illegible]పాదమునకు సూర్యగణము లైదుమాత్రమే. తక్కిన రెండుపాదములు నిట్లే. మూఁడుగణములమీఁదయతిఇదియాటవెలది. సూర్యగణ మొకటి యింద్రగణములు రెండు సూర్యగణములు రెండు మూఁడుగణముల మీఁద యతి. ఇది తేటగీతి.

సీ. ఈతండు వృద్ధని ♦ యెంచి(గిపూజించితే
వసుదేవు( డుండంగ ♦ వసుమతీశ!
ఋత్విజుం డని విచా ♦ రించి పూజించితే
ద్వైపాయనుం డుండ ♦ ధర్మయుక్తి
నాచార్యు(డని విన ♦ యమున( బూజించితే
కృతమతుల్ ద్రోణుండు( ♦ గృపు(డునుండ
భూనాథు( డనియెదు ♦ బుద్ధి(బూజించితే
యాదవుల్ రాజులే ♦ యవనిలోన(

ఆ. వె. బూజనీయులైన ♦ పురుషులలోపల
నెవ్వ( డయ్యె( గృష్ణు( ♦ డిట్టులేల
పూజ్యులైనవారి( ♦ బూంచపనొల్లక
భీష్మపలుకు( జేసి ♦ చేలవైతి.

గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నా ♦ నుండునేని
బాలు(డయ్యును బూజ్యుండు ♦ బ్రాహ్మణుండు
క్షత్రియుండు పూజ్యు( డమితవి ♦ క్రమసమృద్ధి
నుర్విపతులలో నధికు(డై ♦ యుండెనేని.

సభాపర్వము.

జాత్యుపజాతి సామాన్యలక్షణము.—

క. తొలి యదుగు మొదల గురులఘు
వుల నెయ్యది నిల్పు( దాని ♦ బూనిక మూఁడ
ద్గులకుఁ మొదళ్ళ( గ్రమ్మఱ
వెలయింపఁ బలయు జాతి ♦ వృత్తములందుఁ.

క. విరమణములకై యొకచో
విరచింపఁగనగును బ్రాస ♦ విరతులు ప్రథమా
క్షర మిచ్చుకు వచ్చిన యతు
లురవడి నుకువంగవచ్చు ♦ నుపజాతులలోఁ.

సీ. సంస్కృతమ్మున ♦ యందు సర్వకావ్యమ్ములఁ
జరికించి క్షేమేంద్ర ♦ పండితుండు
విరచించె సద్వ్యయా ♦ వృత్తతిలకము ; లాం
ధ్రమ్మునందుఁ గవిత్ర ♦ యమ్ము భార
తామ్నాయఘటక్కుల ♦ యందు వాడఁబచ్చిన
వృత్తరత్నమ్ములు ♦ వివిధకావ్య
సముచితక్రమములు ♦ సరళతరమ్ములు
సర్వకవీశ్వర ♦ సమ్మతములు

తే. కర్ణపుటపేయములు నగుఁ ♦ గాన వానిఁ
దక్క నితరములైన వృ ♦ త్తములఁ బృచ్ఛ
కులు వధానమ్ములందును ♦ గోరఁ జనదు
విషమమాత్రా పవిత్రమా ♦ న్వితములగుట.

ఇది శ్రీసూర్యారాయ నృపచంద్ర ముఖ్యాశ్రిత వేంకట
రామకృష్ణ విరచితంబగు సువృత్తతిలకమునందు
వృత్తావచయంబను ప్రథమవిన్యాసము.



# సువృత్తతిలకము.

## ద్వితీయ విన్యాసము.

ప్రసిద్ధములగు వృత్తములకు లక్ష్యలక్షణములు సంగ్రహించిన పిదప నిపుడు వాని గుణదోషములు ప్రదర్శింపఁ బడుచున్నవి—

ఉ. ఆఱును నేడుఁ బాదమున • కక్షరముల్ గల వృత్తమందు స
ద్వారిజసంభవాస్యముల • వాస మొనర్చెదు నాదు నెమ్మిఁగా
నేరదు ; ఫుల్లపంకజ వ • నిన్ విహరించెదు తేఁటి మల్లికా
కోరక కోటిపైఁ బదము • గూర్పఁగఁ జాలునొకో యొకప్పుడున్ ?

ఉక్తాది సప్తచ్ఛందముల్లోఁ బుట్టిన వృత్తములు సరస్వతీ విశ్రామ యోగ్యములు గావని యెఱుంగునది. భారతామ్నాయమునందుఁ గవిత్రయ మష్టమ నవమ చ్ఛందముల్లోఁ బుట్టిన వృత్తములనైన నుపయోగపఱుపలేదు. కావుననే యప్పకవియు :—

" సీ. అనుగులకు వర్ణములు గొంచె • మగుటఁ జేసి
యందు నుక్తప్రభృతి నవ • చ్ఛందములను
బొడము వృత్తములకు నెల్ల • నడలు లేవు
నాలు పదములఁ బ్రాసముల్ • నడచుఁ గాని. "

అని యతినియమము సేయక యా వృత్తముల కనావశ్యకతను సూచించెను. కాని యష్టమ చ్ఛందోభవం బగు విద్యున్మాలావృత్తమునకు లక్షణముఁ జెప్పుచు:—

" శ్రీదేవిభా • శ్రీప్రాణేశా !
యాదిత్యశ్రే • ష్ఠాదిస్తుత్యా !
వేదోద్ధర్తా • విద్యున్మాలం
బాదై మాగా • ప్రాప్తిం బొల్చున్. "

తాను యతి నిల్పుటచే నా వృత్తమునకు మాత్రము భార తేతరగ్రంథములయందు నెందేని ప్రచారముండునని తెలియవచ్చు ను. సులక్షణసారమునందును యతినిబంధనము గలదు.

"ఉద్యన్నామ్నా ♦ యుక్తంబై సర్గ
విద్యున్నామ్నా ♦ వృత్తం బయ్యెన్"

లేక యీ లాక్షణికులు "విశ్రామస్స్యా ద్వైదైర్వైదైః" అను శ్రుతబోధోక్తమార్గమునేని యనుసరించియుందురు. ఎట్లయిన నీ వృత్తము శ్రావ్యమయినదని ఫలితము.

గీ. "పొడుగువృత్తము లసమాస ♦ ములఁ జెలంగుఁ
జిన్నవి సమస్తపదములఁ ♦ జెన్నుమిగులుఁ
బండితకవీంద్రు లుపయోగ ♦ పరతఁ జేసి
యేగతిరచించిరేనియు ♦ నింపు పుట్టు."

ఉపజాతిభేదములకు సాంకర్య మెట్టులయిన నున్నదియే. అయినను బ్రథమపాదమునందలి పూర్వాక్షరము లఘువుగాఁ జేయుట హృద్యము.

మార్కండేయపురాణమునందు—

ఉపజాతి—స్వరోచిజన్మంబును ♦ వర్తనంబున్
స్వారోచిషాద్యప్రథ ♦ వంబు విన్నన్
నరుండు నిత్యోన్నతి ♦ నవ్యకీర్తి
శ్రీరమ్యుఁడై ధాత్రిఁబ్ర ♦ సిద్ధికెక్కున్.

గీ. వాఁడికొనగల దారము ♦ జాడ లఘుము
ఖమ్ము పద్యము కర్ణరం ♦ ధ్రమ్ముఁ జొచ్చుఁ

గడను మడినద్ధ సూత్రము ♦ కరణి గురుము
ఖమొమ్ముక్రించుక కర్గవే ♦ ధమ్ముశ్ర జేయు.

మూఁడేసి యక్షరములకుఁ దెగ దోధకము మనోజ్ఞముగనుఁడును. అట్లుగాకున్నఁ దాళము దప్పినట్లు విశ్రాంతిని బాయును.

భోజరాజీయమునందు—

దోధకము—చందన కుంకుమ ♦ సంయుత వక్షా
కుందను కుట్మల ♦ కోమల ధామా,

విఱుపులు సరి గాకుండుటకు సందే యుత్తరార్ధము.

నందితభక్తజ ♦ నప్రియయోగా
నంద యహోబల ♦ నాథ నృసింహా.

ఎడఁబడిన యల్పసమాసములఁ బృథ్వి పంపొందును, దీర్ఘసమాసముల నదియే నాడవడఁగి పొట్టిది యగును.

ఆదిపర్వమునందు—

పృథ్వి—ఉపాంశువధఁ జేసి మధ్యము మ ♦ దోర్దండుఁ బంపిని
స్సపత్నముగ ధర్మనందనున ♦ కొక్క బంధించి యే
నపాండవముగా సముద్రవల ♦ యాఖలక్ష్మోణి మ
త్కృపాణపటుశక్తి నత్యధిక ♦ కీర్తినై యేలెదన్.

దీర్ఘసమాసములకు సందే

పృథ్వి—తిలాంశమాశికోటిసంఘటిత ♦ దివ్యదేహంబుతోఁ
దిలోత్తమ యనంగ నొక్కయువ ♦ తిలలామంబు ను
త్పలాక్షి సృజియించె సర్వగుణ ♦ భాసిరూపశ్రియా
కలావిదుఁడు విశ్వకర్మ దన ♦ కౌశలం బేర్పడన్.

నన్నయభట్టు పృథ్వికిఁ బండ్రెండింట యతినిల్పఁ గొందఱాత నిమార్గము గమనింపక "వసుగ్రహయతిశ్చ పృథ్వీ" అను సంస్కృతోక్తమార్గము ననుసరించి తొమ్మిదింటయతిఁ గూర్చిరి. అప్పకవి నన్నయమార్గముననే సూత్రించెను.

తొమ్మిదింట యతి నిల్పినందులకు నైషధమునందు—

పృథ్వి—చతుర్ముఖవిలాసినీ ◆ శయవిలాసపంకేరుహా
శ్రితామృతమధూళికా ◆ సురభిసారసారస్వతా
వితీర్ణమహిమార్ణవా ◆ విభవయోగసంక్రందనా!
పరితాపగుణభూషణా ◆ పరిణతార్థసంభావణా.

లలితముగా నాకారాద్యక్షరములుగల శార్దూలము శ్లాఘ్యము.

కళాపూర్ణోదయమునందు—

శా. ఆవాలుంగనుదోయి యానగుమొగం ◆ బాగుబ్బపాలిండ్ల పెం
పావేణీభర మాతనూవిలసనం ◆ బాయొప్పు లేఁ జెప్పినన్
గైవారంబగుఁగాదె కేవలశిరః ◆ కంపంబుగల్పించి యా
హా! పుట్టింపదె యిక్షుధన్వునకు న ◆ య్యబ్జాక్షి నీక్షించినన్.

విపరీతమునకు నాముక్తమాల్యదయందు—

శా. అర్థావాగ్విబుధ ప్రహోవచనక ◆ వ్యాహార మాహావచ
స్సిద్ధ ప్రాఃకృతతాంగతఃకలి రితి ◆ శ్రీసూక్తి విద్యాధర
మిత్రద్రాఘితత్వ మగా ల్లయంహి కుధియా ◆ మిత్థంవదత్కింనర
మన్త్రర్ధీరాగ్రిణి గెల్పుటుత్సవమునం ◆ దయ్యో స్నభమ్మ్రోత యుర్.

పూర్వార్ధమునందుఁ బాదములు వేఱ్పడుటయు నుత్తరార్థమునందు సమానభూయస్త్వమును శార్దూలవిక్రీడితమునకు శోభావహము.

ఆరణ్యపర్వమునందు—

శా. గీర్వాణప్రవిముక్తబాణపటల • క్రీడావిలూనంబులై
గర్వోన్మత్తసురారిశీర్షములు వీఁ • కన్ డొల్లెఁ గల్పచ్ఛిదా
నిర్వ్యాత్తాంబుదమండలోద్ధతమహా • నిర్ఘాతపాతావధూ
తోర్వీభృద్ఘనగండశైలములతో • నూహింపఁదుల్యంబులై.

విపరీతమునకు విరాటపర్వమునందు—

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసా • స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవి • ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్పు డను దో • ర్లీలన్ విజృంభించి గం
ధర్వవ్రాతము మానముంగొనుట త • థ్యం బెమ్మెయింగీచకా.

మానినికిఁ బదుమూఁటను గవిరాజవిరాజితమునకుఁ బదునాల్గింటను యతిఁ గూర్చుట వాగనుశాసనసమ్మతము. కవిబ్రహ్మ యా రెండువృత్తములను నన్నయమతము ననుసరించి యేకయతికములుగను మతాంతరాశ్రయణమున యతిత్రితయసంయుతములుగను రచించెను. భారతహృదయమిట్లుండ నప్పకవి మానిని కేకవిశ్రాంతియుఁ గవిరాజవిరాజితమునకు యతిత్రయమును విధించుటకుఁ బ్రమాణము లేదు.

ఏకయతికి నన్నయభట్టారకుఁడు—

మానిని.

తమ్ములుదానునుధర్మతనూజుఁడు • దక్షిణసంభృతసత్క్రియుఁడై
యమ్మునినాథవరేణ్యున కర్థి విన • యమ్మున మ్రొక్కి సమున్నతపీ
ఠమ్మున నుంచి యథావిధిపూజలొ • డంబడఁ జేసి మునీశ్వర నా
య్యమ్మున నీవిటవచ్చుటఁజేసికృ • తార్థులమైతిమియందఱమున్.

ఆదిపర్వము—

కవిరాజవిరాజితము.

చనిచని ముందట నాద్భుతవిగ్రహ • సారభధూమలతాతతులం
బెనఁగినమౌక్తికులకొమ్మలమీఁదన • పేతలతాంతములై నను బా
యని మధుపప్రకరంబులఁజూచి జ • నాధిపుఁడంత నెఱింగెఁదపో
వసమిదియల్లదె దివ్యమునీంద్రని • వాసముదానగునంచు నెదన్.

ఆదిపర్వము—

ఏకయతికిఁ దిక్కనసోమయాజి

మానిని.

జాదము నప్పుడు సర్వజనంబులు• చూచి భయంపడియిప్పని యి
మ్మేదిని సేవలకుం గురుకోటికి • మృత్యువుగాని నిజం బలఁతిం
బోదని యాడరెయమ్మెయినాదగు • బుద్ధికిఁదోఁచినసత్యముదా
మోదరపాటిలదేకొదుకంచుఁబ్రియో క్తులువల్కనఁబెంపుసెడున్

కవిరాజవిరాజితము.

అనయములోలతమైవిషయప్రచ • యంబనుదుస్తరపంకమునన్
మునుఁగుచుఁదేలుచునుండఁగఁగాలము• ముట్టిరుజాజరనెవ్వగపై
కొన దొరకొల్పికప్రమంబునసంగము • క్రొవ్వనుజెల్వను బాపి (ప్ర)మో
దనరహితంబుగఁజేసి యపాత్రపు • జావాసరించుఁగురుప్రవరా.

యతిత్రయమునకుఁ దిక్కనసోమయాజి—

మానిని.

కూలియుఁ గాంతి యి • గుర్వఁగఁ దేజము• గుందక
వహ్నులు • గూ ప్రశిఖా

జాల మదంగియుఁ ♦ జాయవెలింగెడు ♦ చందము
నొందిరి ♦ శల్యుఁడుఁ బాం
చాలుఁడుఁ గర్ణుఁడుఁ ♦ జావగురుండును ♦ శాంతన
వుండు ని ♦ జంబునకీ
బాలుఁడు వీరిప్ర ♦ భంగడచెంగుణ ♦ భద్రునిఁ
గంటె సు ♦ భద్రసుతుం.

కవిరాజవిరాజితము—

అనవుడు నిట్లను ♦ నన్నరపాలున ♦ కాతఁడు
మోతుము ♦ నర్థిజగ
జ్జనులకుఁ బుట్టుట ♦ వన్మతిఁ గోరి వి ♦ శారదు
లాదర ♦ నంభృతులై
యనఘ సుదుస్తర ♦ మైన భవంబున ♦ కచ్చగు
సీయితి ♦ హానము బో
ధనమహనీయవి ♦ ధంబునఁ జెప్పి రు ♦ దాత్తగు
ణాశ్రియ ♦ తామహితా.

లయగ్రాహియందుఁ బ్రాసములకుఁగా విశ్రీవర్ణకము సాఁగనిచ్చుట సులభమై హృదయంగమముగ నుండును.

ఆదిపర్వమునందు—

లయగ్రాహి.

చందనతమాలతరు ♦ లందునగరుద్రుమము ♦ లందుఁ
గదళీవనము ♦ లందు లవలీమా
కందతరుమండలుల ♦ యందును విలోలదర ♦ విందసరసీ
వనము ♦ లందు వనరాజీ

కందళితపుష్పమక • రందరసముం దగులు • చుం
దనపు సౌరభము • నొంద జనచిత్తా
నందముగఁ బ్రోషితుల • డెందము లలందురఁగ • మంద
మలయానిల మ • మందగతి వీచెన్.

స్త్రీపర్వమునందు—
లయగ్రాహి.

అమ్ములును విండ్లుఁ బరి • ఘమ్ములును దోమరచ • యమ్ములును
గుంతనిక • రమ్ములుఁ గనత్ఖ
డ్గమ్ములు సహీనమున • లమ్ములును జక్రనివ • హమ్ములును
లోనగు న • నమ్మృతమహోగ్ర
శ్రమ్ములును గండలును • నెమ్ములుఁ గపాలములు • నమ్మిళిత
రూపకళ • లమ్ములయి సంగ్రా
మ మ్మమృతులదారుణవి • ధమ్మగుట దెల్పుటధి • కమ్మగు
కలంక హృద • యమ్ముగ నొనర్చెన్.

నన్నయ మధ్యాక్కరకు నాల్గుగణములమీఁద యతినిల్పె నె ఱ్ఱన్న మూఁడింటిపై విరతిఁ గూర్చెను. అప్పకవి యెఱ్ఱన్ననే యను సరించెను.

నాల్గింటి మీఁద యతి నిల్పినందులకు నన్నయ—
మధ్యాక్కర.

కడు నిమ్ముగా దున్ని బీజములు వల్లి • కర్షకుండున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ • దత్ఫలసిద్ధి
నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపని • నాఁ డేమి సేయఁ
గడఁగి చేయంగలదానిఁ జేయును • గాక కర్షకుఁడు.

మూటిపై యతికినెత్తాపగ్గద—

మధ్యాక్కర.

అనదృశతేజుఁడు బ్రాహ్మ • ణానీకసహితుఁడై కడఁగి
వసుమతియందునధర్మ • వర్తులైయున్నమ్లేచ్ఛులను
మసలకనిజశక్తిఁజేసి • మడియించిధర్మంబునిలిపి
వసునిభుండొనరించుఁజేర్మి • వాజిమేధమునిష్టయొప్ప.

గణక్రమనియమము లేని కందాదులయందలి యవలక్షణము వీనియం దపస్వరము బలె నజ్ఞుండును దెలియును. కాని యిట్టి దని పలుకనేరఁడు.

కందమునందలి యవలక్షణమునకు—

క. అంకితమాయననీకల
వేంకటపతి యిష్టమైన • వేల్పగుటఁదదీ
యాంకితము చేయుమొక్కొక
సంకేతమ కాకరఁడర • నన్నేఁగానే.

అముక్తమాల్యద—

మఱియునందే—

క. త్రివిధోత్పాతము లొదవిన
నవనివిభుఁడు విడువవలయు • నధికద్రవ్యం
బవనీసురముఖసురముఖ
పవనసఖముఖములభుక్తి • బలిహోమవిధిన్.

పై రెండింటియందును గణభంగము లేకున్నను "అతఁడరవన్" "పవనసఖముఖముల" అనుచోట్ల ననుభవైక వేద్యమగు నపస్వరముగలదు. కందమునకుద్వితీయ చతుర్థపాదముల మొదట జగణము

తే. భార్యయునుదానుబుత్త్రిలు ♦ పంచికొన్న
వాఁడుపసులఁబెక్కిటినేలు ♦ వాఁడుకపట
కృత్యములమ్రుచ్చిమినిశిల్పి ♦ కృతులఁబ్రదుకు
వారు పంక్తిదూషకులండ్రు ♦ పౌరవేంద్ర.

పాదాంతమునకన్వయము తెగకుండుటకు—

సీ. కవలలోనొకఁడొండె ♦ గాండివియొండెవృ
కోదరుఁడొండె నీ ♦ వొండెఁజేత
గదగాని యొక్కటి ♦ కయ్యంబునకుఁబూని
యేర్పడనిలిచిన ♦ నీతుణంబ
సమయంగఁజూచెదఁ ♦ గ్రమమునమీరెల్ల
నొకఁడొక్కఁడేతేరఁ ♦ బ్రకటబాహు.
దర్పంబువోఁగఁడొంద ♦ ధరఁగూలవ్రేయుచు
వచ్చెదమఱియు నీ ♦ వారిలోన

తే. నలిగియెవ్వఁడుదాఁకిన ♦ నట్లనాడు
గదకునరసేసిపేర్చెదఁ ♦ గడుగదార
ణంబునాతోడఁజేయుమ ♦ నస్త్రహారుండు
గడఁగలేఁడుమీకెందుఁబోఁ ♦ గలదునేఁడు.

శల్యపర్వము.

గీ. ఇట్టులుద్దేశలేశముఁ ♦ బట్టియేను
కింతవచియించితిమి, బుధు ♦ లీవిధముగ
నఖిలముయథోచితముఁదెలి ♦ యంగవలయుఁ
గలదె? కవితానముద్రముఁ ♦ గడవనావ
మొదటిగురువులఘుద్వయ ♦ మ్మగనొనర్ప

నుత్పలరుచంపకమ్ములుగా ♦ నొప్పు; నట్లె
స్రగ్ధరావృత్తమును మహా ♦ స్రగ్ధరయగు
నిట్లుశార్దూలమనంగు మ ♦ త్తేభముగను
దేదీప్యంగవిరాజవి ♦ రాజితముగ
మాలినీవృత్త, మట్టులే ♦ మత్తకోకి
లమ్ములతరళమ్ములగుం, జంప ♦ కమ్ములాదిని
నాలుగక్షరములువీడ ♦ నర్కుటమగుం
గవులుదీనినకోకిల ♦ కాకమందు
లిట్టిదశలము నిలవచి ♦ యింపలేదు
చెప్పంగానేల? యది స్వత ♦ స్సిద్ధమౌకద
వృత్తవేదికి, నొరులకు ♦ వినుపనేల?

క. నానావిధాగుణావ
గ్లానులకును దోషలేశ ♦ గతిచతురులకుం
గానిసూక్ష్మక్రమమ్ముల
నేనివచించితిమియోగి ♦ హృద్గమ్యములన్.

ఇది శ్రీ సూర్యారాయనృపచంద్రముఖ్యాశ్రిత
వేంకట రామ కృష్ణ విరచితంబగు
సువృత్తతిలకమునందు
గుణదోష దర్శనంబను
ద్వితీయవిన్యాసము.



నిలుప గతి కుంటువడిన ట్లగపడునుగాని యించుక గమకించి చదువ నతి సుందరముగ నుండును.

క. అనుపమనియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతువు • హస్రముల్ముఁబే
సినవారికంటె నక్రో
ధనుఁడ కరంబధికుఁడండ్రు • తత్త్వవిధిజ్ఞుల్.

ఆదిపర్వము.

గీతములందలి యవలక్షణములకు—

తే. వసరుశాకాయ లవణాయ • వా యటంచుఁ
బెసఁగుధూళీశ్వరగృహోదర • కియనునాస
మంచి యూరగికుఁగాటువా • మునకు బలిరు
రౌసఁగఁదసిభగ్స్తైక్షి సౌఖ్య • నువిదమదిని.

ఇందు 'ధూళీశ్వరగృహోదపియన నాస' అను-చోట శ్రోత్రగ్రాహ్యమగు నసన్వయముగలదు. ఇట్లే సీసము మొదలగువానియందును దెలియునగు. పాదాంతమునందుఁ బదవిరామముసేయక పదమధ్యమున యతిస్థానములు గూర్చుట ప్రౌఢి.

మ. బకవిధ్వంసనమాచరించితి, హిడిం • బప్రాణముల్గొంటి, కీ
చకనిర్మూలనకేలినల్పితి, జరా • సంధాంగకస్పైర్యభం
జకలీలన్వెలసిల్లి, తీవని మను • ష్యస్ఫూర్తిమాత్రమ్ముల్లే
చొక మర్త్యుండను రెట్లునీకుమతిలో • నూహింపకిట్లాడితే.

సీసపద్యమునందుఁ బ్రతిపాదమునంత్యపదము నసన్వయమును దెగుట రమణీయము.

సీ. తొడరినహరునైన ♦ దోర్బలంబునఁదన్ను
మిగులంగనీఁడను ♦ మేటిమాట
యమరేంద్రునర్ధాస ♦ నమునకునైనన
ర్హుండెంతయును నను ♦ గూషిమాట
జమునిలుసొచ్చిన ♦ జంతువునైనను
గాచునెమ్మెయినను ♦ రాచమాట
దనుఁగోరియూర్వశి ♦ దానవచ్చిననైన
లోలుండుగాఁడను ♦ మేలిమాట
తే.గీ. శౌర్యవైభవప్రాభవ ♦ శౌచములకు
నౌరులకైనగైవారమై ♦ యుల్లసిల్లు
నొక్కనికినివియెల్లను ♦ నిక్కమట్టి
యొందఁగలుగునె యర్జును ♦ నీడువాఁడు॥

విరాటపర్వము.

పాదాంతమునఁ బదము తెగకుండుటకు—

సీ. జాదరిగరదుండు ♦ వేదంబు సదువని
వాఁడువడ్డికినిచ్చు ♦ వాఁడుగాయ
కుండుగ్రామముపనిఁ ♦ గుడుచునాతఁడుగృహ
దాహికుష్ఠముగల ♦ తనువునాతఁ
డఖుఁదెవుల్గొన్నాతఁ ♦ డఖిలవస్తువులును
నమ్మునతఁడు సో ♦ మమున్విక్ర
యించినయతఁడబ్ధి ♦ సంచారలాభోప
జీవకుండుర్వీశ ♦ సేవకుండు

విరాటపర్వమునందు—

మ. విలసద్గాండివచాలనోద్ధతిగన • దివ్యద్యుల్లతాలీలగా
నలఘుస్ఫారకఠిధ్వజధ్వని సము • ద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందెఁ దేరితఁడు ప • ర్జన్యాకృతిం బొల్చె దో
ర్బల తీవ్రారిపదాఘదుర్విషహగ • ర్వస్ఫూర్తి నిరూఢమూర్తిగాన్.

శా. యోధాగ్రేసరుఁడిద్ధతేజుఁడు రణో • ద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు గురు • క్ష్మాపాలవాల్లభ్యల
క్ష్మీశ్రద్ధామాత్ముఁడు జామదగ్న్యకలిత • శ్రీశస్త్రవిద్యాఢ్యుఁడీ
రాధేయుం డొకచీరికింగొనఁడు వీ • రవ్రాతముం బోరులన్.

ఘోరయుద్ధాదికమును వర్ణించునపుడు స్రగ్ధరా మహాస్రగ్ధరలు వాడుదురు.

ఆరణ్యపర్వమునందు—

స్రగ్ధర.

లంకాలుంటాకుఁడుద్య • ల్లఘుతరగమనో • ల్లాసియైడాసివీఁకం
బొంకంబేపారఁ జంచ • త్పృథుజరఠతమహా • భూరుహంబెత్తి వ్రేసెం
గింకన్ధూమ్రాక్షువాఁడుం • గెడసెనువదనో • త్కీర్ణకీలాలధారా
పంకప్రాగ్భారమగ్నా • పఘునవిఘటిత • ప్రాణుఁడైయాహవోర్విన్.

మహాస్రగ్ధర.

కని ధూమ్రాక్షుండువిశ్వ • గ్గగనరసలన • త్కాలమేఘుంబపోలెన్
ఘనమార్వీఘోష గర్జం • గడఁగిశరశతా • కల్పితాసారదుర్ద
ర్శనవీరారంభుఁడై నర • సకలహరిచమూ • సంఘమున్వ్యాప్యాలంబై
చనెఁగూలెందూలెలావుం • జలమునుజెదర • న్నందడిన్వ్రచ్చనొచ్చున్

కృత్యారంభము శార్దూలవిక్రీడితమునందో నుత్పలమాలిక యందో వ్రాయుదురు.

మనుచరిత్రమునందు—

శా. శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ • జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీ • తిన్నిల్పినాఁ డో యనం
గా నందారుసనందనాదినిజభ • క్తశ్రేణికిం దోఁచు నా
జీవాత్ముండు కృతార్థుఁ జేయు శుభదృ • ష్టిం గృష్ణరాయాధిపున్.

విరాటపర్వమునందు—

ఉ. శ్రీయనఁ గౌరినాఁ బరఁగు • చెల్వలచిత్తము పల్లవింపఁ భ
ద్రాయితమూర్తియై హరిహ • రంబగురూపముఁ దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని • పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయితకిచ్చమెచ్చు పర • తత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

ద్వితీయాద్యాశ్వాసములకు మొదలఁ గందముఁ జెప్పినారు.

భాగవతమునందు—

క. శ్రీకంఠచాపఖండన
పాకారిప్రముఖవినుత • భండన! విలస
త్కాకుత్స్థవంశమండన
రాకేందుయశోవిశాల • రామనృపాలా.

సూర్యచంద్రోదయ పరిశ్రమసురతాదివర్ణనముల సీసము గూర్తురు.

విరాటపర్వమునందు—

సీ. సరసిజాకరములు • నిష్పంకతఁ జేసిన
భవ్యాతపమ్ముల • ఫలమునంగ

# తృతీయవిన్యాసము.

——:o:——

తే.గీ. రోషరహితమ్ములును గుణ ♦ భూషితములు
నగు సువృత్తములను ముక్తి ♦ యములఁబోలెఁ
దగినపట్టులఁగూర్చ నం ♦ తయుఁ బ్రబంధ
మతిశయిల్లు సుదృగ్మనో ♦ హారియగుచు.

శాస్త్రము, కావ్యము, శాస్త్రకావ్యము, కావ్యశాస్త్రము నని వాఙ్మయము నలుదెఱంగులుగలది.

సర్వకావ్యలక్షణములు దెలుపునది శాస్త్రము.

రసాలంకారయుక్తము కావ్యము.

ఎల్లపురుషార్థముల నుపదేశించునది శాస్త్రకావ్యము.

భారతము మొదలగునది కావ్యశాస్త్రము.

వేదమందుస్పైఁ బక్షాంతరపూర్తివలెఁ గొందఱు గేవలశాస్త్రమునందున గావ్యలక్షణము సూపుదురు. అందఱకుఁ దేటతెల్లముగాఁ దెలియుటకై శాస్త్రమును గీతాదనుకరివృత్తములతోఁ రచింపవలయును.

కావ్యమునందును గావ్యశాస్త్రమునందును రసవర్ణనముల కనుగుణముగ వృత్తము లుపయోగింపవలయును. శాస్త్రకావ్యమునందతిదీర్ఘవృత్తము లనావశ్యకములు.

క. వినుముకవిప్రభుశాసన
మునఁ జేసి యనర్హవృత్త ♦ ములు నష్టాశ్వ
మ్ములనగను రోగ్రహాముస న
ర్జునురథ్యము లవ్విరాట ♦ సుతురథ్యములే.

ఉ. ఐన నవస్థకుందగిన ♦ యట్టిసువృత్తములం బ్రబంధముల్
జానగు సాధుపూరుషుల ♦ చందమునం దమకంబుపేర్మి న
స్థానమునన్సువృత్తమణి ♦ దామకమునొమ్మలనూలి గుత్తుకం
బూనిచినట్లు గూర్పనది ♦ బుద్ధివిహీనతఁ జాటిచెప్పెదర్.

కావున నిపుడు వృత్తములందగుచోట వినియోగపఱుచు విధము దిఙ్మాత్రముగ నుదాహరించెద.

ఆశ్వాసాంతమున మాలినీవృత్త మనుప్రాసభేదములతో నెక్కొలుపవలయును.

విరాటపర్వమునందు—

మాలిని.

నిగమకుసుమగంధో ♦ న్మేషపూతాభిధానా
సగుణవిగుణలీలా ♦ సామ్యసాక్షిత్వనానా
జగదవనవిధాన ♦ స్థైర్య దత్తావధానా
నగశరధినివాసా ♦ నందనంస్తూయమానా.

సక్రోధ ధిక్కారమునఁ బృథ్వీవృత్తముచాలియుండును.

ఆదిపర్వమునందు—

పృథ్వి.

ఉపాంశువధఁ జేసిమధ్యము మ ♦ దోద్ధతుంజంపి ని
స్సపత్నముగ ధర్మనందను న ♦ శక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవల ♦ యాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి సత్యధిక ♦ కీర్తినై యేలెదర్.

నృపాదులశౌర్యమును గొనియాడునపుడు మత్తేభ శార్దూల విక్రీడితములు సంమతములు.

దివసముఖాభినం ♦ దిత చక్రియుగ్మక
మ్ముల యనురాగంపుఁ ♦ బ్రోవనంగ
హరిహరబ్రహ్మ మ ♦ హానుభావమ్ముల
క్కూటిగాఁగఁగరఁగిన ♦ గట్టియనఁగ
నతులవేదత్రయ ♦ లతికాచయము పెను
పొందఁబుట్టెడు మూల ♦ కందమనఁగ
తే. గీ. నఖిలజగముల కట్టెఱ్ఱ ♦ యగుచు జనస
మాజకరపుట హృదయన ♦ రోజములకు
ముకుళనంబును జృంభణం ♦ బును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రి ♦ పై వెలింగె.

ద్రోణ పర్వమునందు—

సీ. నలువచెందొవల రే ♦ కులకు నన్నువువెట్టఁ
గోరికావించిన ♦ గుళికయనఁగ
నఖిలద్విజశ్రేష్ఠ ♦ మగుచకోరచయంబు
తపముసముల్లస ♦ త్ఫలమనంగఁ
జిగురుజొంపమునను ♦ జిగియొప్పనుదయాద్రిఁ
బొలుపారునవకల్ప ♦ భూజమనఁగఁ
బూర్వపయోరాశి ♦ పొంతఁగెంజాయచె
న్నొందవిన పవడంపుఁ ♦ బొదయనంగ
తే. గీ. నరుణరుచిఁ దనమండల ♦ మతిశయిల్లఁ
బొడిచిదివిఁబ్రాఁకి దీధితు ♦ లడరఁజేసి
యంతకంతకు నెక్కుచు ♦ నంతమసము
గ్రాలుకొననీక చండ్రుండు ♦ గ్రాలెనధిప.

శృంగారనైషధమునందు—

సీ. పతిపాణిపల్లవ ♦ చ్యుతనీవిబంధన
వ్యగ్రబాలాహస్త ♦ వనరుహంబు
ధవకృతాధరబింబ ♦ దశనక్షతవ్యథా
భుగ్నలీలావతీ ♦ భ్రూలతంబు
ధరణీనాయకభుజా ♦ పరిరంభమండలీ
గాఢపీడితవధూ ♦ ఘనకుచంబు
వరనఖాంకుర మృదు ♦ వ్యాపారపులకిత
నీరజాక్షీ నితం ♦ బోరుయుగళి

ఆ. గీ. యస్తివామ్యభార ♦ మస్తికౌతూహలం
బస్తిఘర్మసలిల ♦ మస్తికంప
మస్తిభీతియస్తి ♦ హర్షమస్తి వ్యథం
బస్తివాంఛమయ్యె ♦ నపుడు రతము.

వనవిహారమున సంవాద వైఖరి రగడభేదములు వాక్రుత్తురు.

చంద్రికాపరిణయమునందు—

* చెలువచెలువపుమొగ్గచాల్కొని ♦ చేరుచేరుగఁ గూర్తువిచ్చట
నలినినలినిభకుంతలామణి ♦ నన్నునన్నులు వేడముచ్చట
తిలకతిలకకులంబుగన్గొన ♦ దివ్యదివ్యాగములపోలిక
నలరునలరుల నెనయురోలం ♦ బాళిబాళి చిగుర్పచాలిక
యింతియింతిటఁజేరఁ దగదెసు ♦ మేరమేరయె వకుళపాళిని
కాంతకాంతవశరములల్లవె ♦ కాంతకాంతమె చాలహాళిని

---

* భారతమునందు రగడలు లేమిఁ దల్లక్షణము ప్రథమవిన్యాసమునఁ జెప్పంబడదయ్యె.

# తృతీయవిన్యాసము.

సీ. సంస్కృతకవయితల్ ♦ సర్గముకడవెళ్ళ
విషయానుగుణముగా ♦ వృత్తమొకఁడె
హావణింతురట్లుగా ♦ కాంధ్రకవీశ్వరుల్
తఱచు సీసమ్ముగీ ♦ తద్వయమ్ము
శార్దూలమత్తేభ ♦ చంపకోత్పలములు
కందమ్మునీయష్ట ♦ కంబెకూరు
రవివక్షితమ్ముగా ♦ నటుగానవానికి
నరిదివ్యాఖ్యానుగు ♦ ణ్యమ్ముదెల్ప

గీ. నయిననుద్దేశలాభము ♦ నధిగమించి
కొన్నిటికిలక్షణంబిందుఁ ♦ గూర్పఁబడియెఁ
దక్కువైచిత్ర్యమాత్రపా ♦ త్రమ్ములయిన
వృత్తముల వినియోగము ♦ వినుపలేదు.

గీ. గీతకంద సీసమ్ములు ♦ కేవలముగఁ
గైకొనిరచింపుదురు శత ♦ కములుమాత్ర
కలపిరేనియుఁ జంపకో ♦ త్పలములట్లు
తుల్యజాత్యమ్ములను గల్పు ♦ దురు సుకవులు.

చ. అనియిటుసర్వవృత్తముల ♦ యందుఁబ్రసంగముగల్గు వశ్యవా
క్కనులకు మేలివృత్తములఁ ♦ గావ్యములన్ విభజించుపద్ధతిన్
వినిచితి: మొంటరెండిటనొ ♦ వృత్తములన్ శ్రమపడ్డవారు ని
ర్ధనులవిధంబునం బనికి ♦ రారు యథా వినియోగధోరణిఁ.

గీ. తనకునలవాటు గలుగు వృ ♦ త్తమ్మునందె
తనదు సందర్భమునుదెల్పఁ ♦ దగు; మఱొంటఁ
బూరణము సేఁతయేకాక ♦ పొలుపువుట్ట
దొకట నేయాదరము పూర్వు ♦ లకును గలదు.

సీ. పొలుపుగాఁ జంపకో • త్పలమాలికల్గూర్ప
దిట్టండు నన్నయ • భట్టసుకవి
యందమ్ముమీఱఁ గాఁ • గందమ్ము రచియింప
శూరుండు దిక్కన • సోమయాజి
చక్కఁగా మత్తేభ • శార్దూలములనాడ
ఖ్యాతుండు బమ్మెర • పోతరాజు
వాసి యెసంగఁగా • సీసమ్ములందీర్ప
విన్నాణి శ్రీనాథ • విబుధహేళి

గీ. సకల వృత్తములంగూర్ప • జాణలయ్యు
నీవిధమ్మునఁ బూర్వక • వీశ్వరులును
వేడుకగలారు కొండొక • వృత్తములను
సుందరులు రత్నహారము • లందుఁ బోలె.

చ. అనువగుచోట్ల వృత్తమణు • లచ్చుపడంగ సువర్ణవస్తువుల్
దనరు సముల్లసద్రచిని • తాంతముఁ ; గావున నిందు మేము సె
ప్పిన వినియోగమార్గమును • వీడక వృత్తనివేశ సమ్మున
ర్పను సమకట్టుఁడీ కవులు • వశ్యవచోవిభవుల్ కృతజ్ఞతన్.

గీ. ఈవగిదిఁ నర్థులకు, బ్రీతి • మోపయోగి
విబుధగణమునకును సువి • వేకకారి
కవికులేశ్వరులకునైన • వివిధ సూత్ర
తత్వనిర్ధారణాహర్ష • దాయివెలసె.

ఇది శ్రీసూర్యారాయ నృపచంద్ర ముఖ్యాశ్రిత
వేంకటరామకృష్ణ విరచితంబగు సువృత్త
తిలకమునందు వృత్తవినియోగంబను
తృతీయ విన్యాసము.

